



రచయిత : అవధూత నిర్మలానందస్వాములవారు
చిరునామా : పోస్టు ముధక్‌పల్లి - 503 23[illegible]
మండలం తా॥ జి॥ నిజామాబాద్.

గమనిక : క్రోధననామ సంవత్సర మాఘ పూర్ణిమ ఆదివారం తేది 23-2-1986 వార్షిక గురుపూజ సందర్భమున ముద్రింపబడినది.

# -: విన్నపము :-

పరమ పవిత్రమగు నా భారత సోదర సోదరిమణులారా !
మన దేశమున యెందరో మహనుభావులు రచనలు గావించిరి యెందరో యోగీశ్వరులు జన్మించిరి తెలుగు భాషలో వేమన, సుమతీ, పధ్యములను యెరుగనివారుండరు అలాగే ఆత్మాఽనాత్మ విచార గ్రంధములు కూడ వ్రాసిరి వారి కోవకు జెందిన శతకమునే నేను వ్రాసితిని. రచనలు యితరుల మనంబులోనికి జొచ్చుకొని పోయి ఆలోచింపజేసెవి లావుండవలెను కాని సంఘ ఆందోళనకు దారి తీసే విలాగ వుండకూడదు నైతిక విలువలు సాంఘీక విలువలు ఆర్థిక విలువలు మనోనిగ్రహము గల్గెలాగున వుండవలెను భారత సంస్కృతిని పెంపొందించవలెనే గాని దిగజార్చకూడదు, మత్తుపదార్థములను సేవించుట జూదమాడుట పరస్త్రీ సంభోగకాంక్ష ఇత్యాది వ్యసనలోలులైవారి వారి మనస్సు యేదోపొందవలెనని తీవ్ర ఆందోళనకు గురియగుచున్నది. ఆమాయామోహిత ప్రపంచమును తన విచారము ద్వార తెలుసుకొని ఆత్మవైపు దృష్టి మరల్చిననాడు ఈ గొడువలన్నియు సమసి పోవుట సత్యము.

ఇట్లు

మీ సోదరుడు

చరాచర సుఖాభిలాషియగు

శ్రీ అవధూత నిర్మలానంద స్వాములవారు

కం॥ శ్రీ శివరూపుండుగురుడు
నా శిరమందు నివసించి। నాదంబయ్యెన్
శ్రీ శారద యానాదము
శ్రీ శంకరి పట్టిబట్టి జెప్పించెమిలన్॥ 1

ఆ॥వె॥ తప్పులున్నచోట। తప్పకదిద్దుడు
దిద్దిన మదికద్ది। దిద్దవలెను
విసుగు బుట్టుచున్న। వినకు చదువకోయి
నిజమనె యవధూత। నిర్మలుండు॥ 2

ఆ॥వె॥ పట్టిపట్టియేను। పఠణ జేయుమనను
ఇట్టి పొత్త్రరాజు। మింపుగాను
చీమ తీపెరుగును। దోమకే మెరుకరా
నిజమనె యవధూత। నిర్మలుండు॥ 3

ఆ॥వె॥ తప్పు తప్పయనెడి। తప్పు దారి కొడుకా
తప్పు మనసునంటి। తనను జెఱచు
తప్పు దెలియలేక। తరలిరి యెందరో
నిజమనె యవధూత। నిర్మలుండు॥ 4

ఆ॥వె॥ తీపి మాటలువిని। తేపతేపకు బోకు
తిట్టి చెప్పువాడు। గట్టివాడు
అంధకారమందు। అతడు దీపపుకాంతి
నిజమనె యవధూత। నిర్మలుండు॥ 5

ఆ॥వె॥ ఆలుమగలు తగవు। లాడివిడాకులు
చేత బట్టుకొన్న। చిగ్గుచేటు
తనవు తనవుతాకి। మనసులు దాకెనా?
నిజమనె యవధూత। నిర్మలుండు॥ 6

ఆ॥వె॥ పూర్ణ మూఢమతులు। పూర్ణ విజ్ఞానులు
మార బోరువార్ని। మార్చలేరు
మధ్యరకము వారి। మనసు లుయ్యాలాలు
నిజమనె యవధూత। నిర్మలుండు॥ 7

ఆ॥వె॥ తిండి లేనినాడు। తిండికై దిరుగును
అన్ని గలుగయతని। కాశమెందు
ఆది నుంచిమనిషి। ఆరాటజీవిరా
నిజమనె యవధూత। నిర్మలుండు॥ 8

ఆ॥వె॥ జీవితం క్షణికము। చింతలు అధికము
ఎందు కనగసుఖము। నందెకొరకు
చింత విడువసుఖము। జిక్కుటతథ్యము
నిజమనె యవధూత। నిర్మలుండు॥ 9

ఆ॥వె॥ అందరూ ప్రబోధ। యంద్రపవీనులే
తనను వుద్ధరించు। కొనుటయేది?
తనవు తననుమరయు। తర్కంబులుండునా?
నిజమనె యవధూత। నిర్మలుండు॥ 10

ఆ॥వె॥ కలహములు సులభము। గాబుట్టి చివరికి
కష్ట నష్టములను। కలుగజేయు
కంపకున్న దూల। కాయముట్టిన భంగి
నిజమనె యవధూత। నిర్మలుండు॥ 16

ఆ॥వె॥ నిప్పులేకమంట। జెప్పు మెటుల బుట్టు
కొట్టు కొనెటి మొఱటు। కొడుక వినుము
కారణంబులేక। కయ్యంబు యెటులౌను
నిజమనె యవధూత। నిర్మలుండు॥ 17

ఆ॥వె॥ మోసములను జేసి। మీసముల్ ద్రిప్పుచు
దొరల విధముదిరుగు। దొంగలంత
కండ్లు మూసిపిల్లి। కడుపు నింపువిధము
నిజమనె యవధూత। నిర్మలుండు॥ 18

ఆ॥వె॥ చెట్టు వద్దబుట్టు। చెడిపోవు కాలంబు
కుక్కమూతి పింధె। లక్కడుండి
చెడుతలంపు బుట్టు। చెడిపోవు సమయంబు
నిజమనె యవధూత। నిర్మలుండు॥ 19

ఆ॥వె॥ కాలు జారిపోతె। కష్టంబుతోనైన
కాలు దీసిపుండు। కడుగవచ్చు
మాట జారిపోతె। మానదు గాయంబు
నిజమనె యవధూత। నిర్మలుండు॥ 20

ఆ॥వె॥ ధనము, బలము, పదవి। తనదగ్గరున్నను
భాంధవుల్ తదితర। బలగముండు
మూడు వుడుగవీరు। ముఖమైన జూడరు
నిజమనె యవధూత। నిర్మలుండు॥ 11

ఆ॥వె॥ అన్ని రోగములకు। యెన్నెన్నో మందులు
మరణ రోగమునకు। మందు లేదు
చావు తధ్యమైన। చావదు మోహంబు
నిజమనె యవధూత। నిర్మలుండు॥ 12

ఆ॥వె॥ తేనెటీగ ఇంట। తిరుగుచుండెడి ఈగ
రూప మొకటియైన। రుచులు వేరు
మనుజులంత వొకటే। మదిలోన వేరురా
నిజమనె యవధూత। నిర్మలుండు॥ 13

ఆ॥వె॥ ఒక అబద్ధమాడి। ఒప్పించెటందుకు
ఇంక బొంకులాడి। జంకబోడు
గోరుచే చిదుమక। గొడ్డండ్ల దాడెచ్చు
నిజమనె యవధూత। నిర్మలుండు॥ 14

ఆ॥వె॥ కల్లు చెట్టునీడ। చల్ల దాగిన రీతి
పర పడచుల వెంట। తిరుగువాడు
నీతి మంతుడైన। నిందెలు దప్పవు
నిజమనె యవధూత। నిర్మలుండు॥ 15

ఆ॥వె॥ ఎద్దు దున్నపోతు। కెటుల పొత్తుగుదురు
ఆలు కొంటెదైన। అతడి యేద్పు
అతడు సోమరైన। ఆలు బ్రతుకుయంతె
నిజమనె యవధూత। నిర్మలుండు॥ 21

ఆ॥వె॥ కత్తి పోటుకంటె। ఘనమైన దెబ్బరా
మనసు ముక్కలైన। మానవుండ।
అతుకు బెట్టలేరు। అతి తెల్వివారైన
నిజమనె యవధూత। నిర్మలుండు॥ 22

ఆ॥వె॥ ఎలుక యింటియందు। ఎగురుట జూసియు
కొంపకగ్ని బెట్టి। కూలిపోవు
పరుల మాటలువిని। పౌరుషం జెందకు
నిజమనె యవధూత। నిర్మలుండు॥ 23

ఆ॥వె॥ మాటలెన్నొనేర్చి। బూటకంబులజూపి
నడకనడువకుండ। మిడుకువారు
మేకవన్నె పులులు। యేకాలమందైన
నిజమనె యవధూత। నిర్మలుండు॥ 24

ఆ॥వె॥ ఒంటె పెదవులందు। వుండునక్కకుయాశ
క్రింద వూడిపడవు। మ్రింగబోదు
చిక్కని పనులన్ని। చేసౌను మనజుడా!
నిజమనె యవధూత। నిర్మలుండు॥ 25

ఆ॥వె॥ కాంతి జూచిమిడుత। కాలిపోవు విధము
ప్రేమతోడ మనసు। పిచ్చియౌను
ప్రేమమంచి జేయు। ప్రేమ చెడ్డగజేయు
నిజమనె యవధూత। నిర్మలుండు॥ 26

ఆ॥వె॥ ఇల్లు చక్కబడును। ఇల్లాలితోడను
ఇల్లు ముంచుఆలు। కల్లకాదు
పెంచ ముంచవనిత। పిడికిలిలోవుంది
నిజమనె యవధూత। నిర్మలుండు॥ 27

ఆ॥వె॥ గ్రుడ్డివానికూడు। కోపంబుతో వచ్చి
గ్రద్ద వొలకబోయు। గతియు భంగి
తనవు విడచువేల। తనవారు అంధులు
నిజమనె యవధూత। నిర్మలుండు॥ 28

ఆ॥వె॥ మురుగుబురుదలోన।బొరలియుమహిశంబు
ఆవులకును పూయు। అదియు వినుము
తప్పు వొకడుజేసి। తలకింత బూయురా
నిజమనె యవధూత। నిర్మలుండు॥ 29

ఆ॥వె॥ దొంగ గొడ్డుమెడకు। దుడ్డునుగట్టిన
దొంగ గుణముమాను। దుర్లబంబు
పైన మార్పుగాదు। లోనమారవలెను
నిజమనె యవధూత। నిర్మలుండు॥ 30

ఆ॥వె॥ మంచినాయకులిల। మంచిబంచిరిగాని
వారి వద్దముసుగు। పాములుండె
చెక్కరున్ననింత। చిక్కదు చీమకు
నిజమనె యవధూత। నిర్మలుండు॥ 31

ఆ॥వె॥ అందునికిలలోన। అద్దంబుగనరాదు
మంధమతికియేల। మంచితనము
స్వయము తెలివిలేక। శాస్త్రంబుననబోకు
నిజమనె యవధూత। నిర్మలుండు॥ 32

ఆ॥వె॥ స్త్రీ వ్యసనమువల్ల। చిత్తంబుజెడిపోవు
త్రాగుబోతుకూడ। దారితప్పు
జూపమాడువాడు। చూడంగ జెడిపోవు
నిజమనె యవధూత। నిర్మలుండు॥ 33

ఆ॥వె॥ కుజన సంఘమందు। కూడిన సమయంబు
ఉండవలసివస్తె। ఓర్పువుంచి
తెలివి గలిగినీవు। తెలిసి తప్పించుకో
నిజమనె యవధూత। నిర్మలుండు॥ 34

ఆ॥వె॥ పుణ్య మనుచుబోయి। పొరపాటుచేసినీవు
మేలుచేయ ఖలుడు। గాలమయ్యి
కీడుజేయజూచు। పాడు చెలిమియేల
నిజమనె యవధూత। నిర్మలుండు॥ 35

ఆ॥వె॥ ధనము తెలివివున్న। దాసుల మనియేరు
బీద,బక్క వాన్ని। పిలువరెవరు
కండ వున్నవాన్ని। కర్మకు బిలుతురు
నిజమనె యవధూత। నిర్మలుండు॥ 36

ఆ॥వె॥ శీలము కులకాంత। సిగ్గులజ్జను వీడి
చెడును తప్పకుండ। చేడెనిజము
ఇట్టి వనితమగని। గుట్టుబయటబెట్టు
నిజమనె యవధూత। నిర్మలుండు॥ 37

ఆ॥వె॥ ఆవు లావులన్ని। అవియు పోట్లాడక
దూడ కాళ్ళువిరచి। దుంకునటుల
నీచ సంఘ మందు। నిజము జెల్లదునుమ్మ
నిజమనె యవధూత। నిర్మలుండు॥ 38

తే॥గీ॥ మంచివాడను యనుకోకు। మనసులోన
ఎరుపు గురవిందతననల్పు। యెరుగనటుల
తప్పు తనలోనవుందేమో। తరచిచూడు
నమ్ముమవధూతనిర్మలా।నందుబలుకు॥ 39

ఆ॥వె॥ కాని సమయమందు। కష్టంబుయనబోక
అణిగి మణిగివుండు। మన్ననీవు
తానుతెల్లబడిన। తర్వాత గొల్చేరు
నిజమనె యవధూత। నిర్మలుండు॥ 40

ఆ॥వె॥ చెలిమి చేయుమనిషి। కలసిమెలసియుండ
నెయ్యమంతబోయి। కయ్యమైన
మర్మధర్మమంత। మందిలో బడిపోవు
నిజమనె యవధూత। నిర్మలుండు॥ 41

ఆ॥వె॥ ధనమధాందులకును। త్రాగుబోతులకును
శిశువువెఱ్ఱివాల్ల। చిత్తమందు
వాల్లుజేసెకైపు। వాల్లతే దెల్యదు
నిజమనె యవధూత। నిర్మలుండు॥ 42

ఆ॥వె॥ మంచి చెలిమిజేయ। మర్యాదగౌరవం
నీచ మైత్రి జేయ। నిందవచ్చు
మంచి చెడులచెలిమి। మనుజుడా కనిపెట్టు
నిజమనె యవధూత। నిర్మలుండు 43

ఆ॥వె॥ నోరు తీపివున్న। వూరుమంచిగ మిన్న
నోరు చేదువున్న। పోరురన్న
ముఖముభూషణంబు। ముదమైనమాటన్న
నిజమనె యవధూత। నిర్మలుండు॥ 44

ఆ॥వె॥ డంబములను బలికి। సంబరపడబోకు
నిజము దెలిసిపోతె। నీకు కీడు
సతతముమితభాష। సాధించఫలముండు
నిజమనె యవధూత। నిర్మలుండు॥ 45

ఆ॥వె॥ కలహము వలదంటి। బలమున్న వారితో
కాని కయ్యమైన। కష్టమనక
కాలము విలువగని। కనిపెట్టి గెల్వుము
నిజమనె యవధూత। నిర్మలుండు॥ 46

ఆ॥వె॥ మూర్ఖ బుద్ధులకును। ముందు జూపున్ లేక
హితము దెలుపరాడు। సతతమినుడు
కీడు జరిగినంక। యేడ్చిన్నా లాభమా?
నిజమనె యవధూత। నిర్మలుండు॥ 47

ఆ॥వె॥ గతము దలచుకొనుచు। కన్నీరు దీయక
ధైర్యము మదిలోన। శౌర్యముంచి
జంకబోక నీవు। సంసారం సాధించు
నిజమనె యవధూత। నిర్మలుండు॥ 48

ఆ॥వె॥ మోసగాళ్ళ గూడి। మోసంబులోబడి
మంచిదని తిరుగకు। మతియు జెడియు
బ్రతుకు బండలైన। బాగుచేయుట కల్ల
నిజమనె యవధూత। నిర్మలుండు॥ 49

ఆ॥వె॥ నాల్కె తీపిమాట। నమ్మకు యెచటైన
విషము మనసుయందు। విస్తరిగు
తెలివిచేత నీవు। తెలుకో మనుజుడా।
నిజమనె యవధూత। నిర్మలుండు॥ 50

ఆ॥వె॥ నీదురాశవల్ల। నిందలు వచ్చును
ఓర్పు, కీర్తిదెచ్చు। ఊహ జేసి
మంచి, చెడులదెలసి। మానవా జీవించు।
నిజమనె యవధూత। నిర్మలుండు॥ 51

ఆ॥వె॥ కలహము వలనయిల। కలుగును చేటయా
చెలిమివలన గలుగు। బలము కలిమి
ఐక్యమత్యముంటె। ఐపోవు పనులన్ని
నిజమనె యవధూత। నిర్మలుండు॥ 52

ఆ॥వె॥ మేలుకోరి జెప్పు। మిత్రుని మాటలు
పెడ చెవియిలయందు। బెట్టె నరుడు
నాశనంబుయౌను। యే సమయంబైన

నిజమనె యవధూత। నిర్మలుండు॥ 53

ఆ॥వె॥ ముఖముయందుతీపి। ముచ్చట ముదమంటి
చాటునుంచి విషము। చల్లెవారు
తేనెపూత వుండి। తెలియని కత్తిరా
నిజమనె యవధూత। నిర్మలుండు॥ 54

ఆ॥వె॥ వచ్చు జీవితాన్ని। పిచ్చి ఊహలతోడ
గాలియందు మేడ। గట్టువాడు
తప్పకుండ జెడును। తర్వాత చింతించు
నిజమనె యవధూత। నిర్మలుండు॥ 55

ఆ॥వె॥ కాదలచినదిలను। కాకమానదనుచు
నమ్మెవాడుచాల। నష్టపోవు
కార్యసాధకునికి। కాని కార్యంబేమి?
నిజమనె యవధూత। నిర్మలుండు॥ 56

ఆ॥వె॥ గొప్ప ధనముగాని। గొప్ప సాధనగాని
లేక పోయినసరె। యేకముండె
చెలిమి బలమువల్ల। యిలను పాలించేవు
నిజమనె యవధూత। నిర్మలుండు॥ 57

ఆ॥వె॥ దుష్టమానవులను। దూరముంచకనమ్మి
తనవతెయనుకొనుచు। ధర్మపరుడు
వారి మోసములకు। వంచింపబడిపోవు
నిజమనె యవధూత। నిర్మలుండు॥ 58

ఆ॥వె॥ పెద్ద పదవిపొంది। పేద ప్రజలమర్చి
నీచ మానవుండు। నిజముగనడు
గద్దె దిగిననాడు। గంగిరెద్దగువాడు
నిజమనె యవధూత। నిర్మలుండు॥ 59

ఆ॥వె॥ మనసులో కపటము। మంచిమాటలుపైకి
బలుకునరులనమ్మ। బయముసుమ్మ
పైన తీపిపూత। లోన విషపు ముద్ద
నిజమనె యవధూత। నిర్మలుండు॥ 60

ఆ॥వె॥ ధనము పొదుపుచేయు। దయతోడమిత్రుడ
ధనము యెక్కువైన। వినయముంచు
గర్వపడిననాడు। కాకుండ పోదువు
నిజమనె యవధూత। నిర్మలుండు॥ 61

ఆ॥వె॥ ధైర్య ముగలిగినను। దగ్గరరానిచో
బలము వల్లయైన। పట్టుపడని
పనులుయన్నినీకు। పాయము జేయును
నిజమనె యవధూత। నిర్మలుండు॥ 62

ఆ॥వె॥ బుద్ధిమంతులైన। బుధులులోకంబులో
ఎవరుయెన్ని యన్న। సవినయముగ
సమయ మెరిగినడిచి। సాధింతురు పనులు
నిజమనె యవధూత। నిర్మలుండు 63

ఆ॥వె॥ కండ్లుముఖముయొక్క। గల్గెమార్పునుబట్టి
మాటమర్మములను। మంచిగ విని
ఎదుటి వారిభావ। మెరుగవలయునుమ్మ
నిజమనె యవధూత। నిర్మలుండు॥ 64

తే॥గీ॥ కమళములపైన దూకుచు। కప్పవుండు
కాని తేనె రుచియెరుగ। కష్టమౌను
గ్రంథములుయెన్న జదివిన। గనరుముక్తి
నమ్ముమవధూతనిర్మలా।నందుబలుకు॥ 65

తే॥గీ॥ దప్పి గలిగినపుడు నూతి। త్రవ్వలేవు
ఎవ్వనములోన యెరుగుము। ఎదనునీవు
ముసలితనమందుయేముండు। మూల్గుదప్ప
నమ్ము మవధూతనిర్మలా।నందుబలుకు॥66

తే॥గీ॥ పెద్దపులిని జూచియు నక్క। బుద్ధిలేక
వాతలెన్నియో బెట్టుక। వదురునటుల
తృప్తి బొందడు తనకున్న। తిక్కవిడక
నమ్ముమవధూతనిర్మలా।నందుబలుకు॥ 67

తే॥గీ॥ నాల్గు గోడల మధ్యన। నీల్గిచాల
తప్పులెన్ని యోజేసేవు। ధర్మము విడి
పరులుగనకున్న అంతరా। త్మెరుగుచుండు
నమ్ము మవధూతనిర్మలా।నందుబలుకు।68

తే॥గీ॥ కలువభామలు విప్పునా। నెలయుపొడక
కమళములు విప్పునారవి। కాంతిలేక
భ్రమలు బోవునకుండలి। పైకిబోక
నమ్ముమవధూతనిర్మలా।నందుబలుకు॥ 69

తే॥గీ॥ పండిగ పదేల్లు జీవించ। పాటిగాడు
నందిగ వొకదినము చాలు। నరుడ యెరుగు
సత్వగుణములో సోదరా। సత్యమెరుగు
నమ్ము మవధూతనిర్మలా।నందుబలుకు 70

తే॥గీ॥ మాటల వలనఋణములు। మాసిపోవు
అవియు తీరును కృషిచేత। అవనిలోన
గాలిలో మేడల్ ఎప్పుడు। గట్టబోకు
నమ్మమవధూతనిర్మలా।నందుబలుకు॥ 71

తే॥గీ॥ పంది పన్నీరుమెచ్చదు। పాణముండి
బురదఅంతెనె యిష్టంబు। బొర్లుచుండు
నీతి రుచికరంబుండదు। నీచమతికి
నమ్మమవధూతనిర్మలా।నందుబలుకు॥ 72

తే॥గీ॥ స్వార్థరహితము సేవచే। సర్వమబ్బు
బలము భాగ్యంబుఐక్యత। పట్టువిడవు
ఛెడ్డకీర్తి వచ్చినచావు। దొడ్డదండి
నమ్మమవధూతనిర్మలా।నందుబలుకు॥ 73

తే॥గీ॥ అసలు చీకటికంతెను। అతిభయంబు
క్రోదమోహంబు చీకటి। కొంపముంచు
శాంతి నీలోనవుండిన। సర్వమబ్బు
నమ్మమవధూతనిర్మలా।నందుబలుకు॥ 74

తే॥గీ॥ కొన్నదంటువంకాయ। కోర్కెతోడ
పైన కొసరిందిగుమ్మడి। కాయువినుము
అధిక యాశవున్నమనకు। అందరాదు
నమ్మమవధూతనిర్మలా।నందుబలుకు॥ 75

తే॥గీ॥ కష్టసమయంబుఁగలిగిన। కాల్లుబట్టి
సుఖము గలిగినతర్వాత। చూడకున్న
గుప్త దానముయనుకొని। జ్ఞప్తిమరువు
నమ్ముమవధూతనిర్మలా।నందుబలుకు॥ 76

తే॥గీ॥ అంత్య నిష్ఠూరమునకన్న। అన్నలార
ఆది నిష్ఠూరంమేలని। అరయువారు
చెదరువారికి యెన్నడు। చింతరాదు
నమ్ముమవధూతనిర్మలా। నందుబలుకు॥ 77

తే॥గీ॥ రాదు పోయినకాలంబు। రానెరాదు
వున్నసమయమువృధజేయు। చున్నవాడు
అర్థ మెరుగనిపాపపు। వ్యర్థజీవి
నమ్ముమవధూతనిర్మలా। నందుబలుకు॥ 78

తే॥గీ॥ కూల గొట్టడము సులువు। కొంపలన్ని
కట్టడం నిలబెట్టడం। కఠినమౌను
దీపముండుగ జాగ్రత్త। దీక్షబూను
నమ్ముమవధూతనిర్మలా।నందుబలుకు॥ 79

తే॥గీ॥ వాడిపోయిన పూవును। వట్టిదనుచు
మట్టి పాలుజేతురు యిట్టి। గుట్టుగనుము
కొంపలో జీవిపోయిన। కంపుగొట్టు
నమ్ముమవధూతనిర్మలా।నందుబలుకు॥ 80

ఆ॥వె॥ మొసలి నీటిలోన। మోదంబుతోనుండు
బయట దీయయదియు। భయముబట్టు
పెద్ద పదవికెక్కి। గద్దెదిగినయంతె
నిజమనె యవధూత। నిర్మలుండు॥ 86

ఆ॥వె॥ నిష్కళంకముండి। నిల్కడగలిగిన
దేశ భక్తులుంటె। దేశమంత
పాడి పంటమనకు। బాగుగ దొరుకును
నిజమనె యవధూత। నిర్మలుండు॥ 87

ఆ॥వె॥ ఆపదున్నవారి। కాదుకో పుణ్యంబు
కాని వొక్కమాట। గనుమునీవు
పాత్ర చూడకుండ। పాలు పోయగరాదు
నిజమనె యవధూత। నిర్మలుండు॥ 88

ఆ॥వె॥ సకల శాస్త్రములను। చదివినప్పటికైన
దుర్గుణంబుబోదు। దుష్టులకును
పెద్దరికముగలుగ। పేదవారినిగొట్టు
నిజమనె యవధూత। నిర్మలుండు॥ 89

ఆ॥వె॥ బుద్ధిమంతుడనుచు। పొగుడుచు వుందురు
ధనము గల్లవాన్ని। ధాతయనియు
గొప్ప కులముయనుచు। అప్పని బిలుతురు
నిజమనె యవధూత। నిర్మలుండు॥ 90

తే॥గీ॥ విప్లవం విప్లవంబని విర్రవీగు
వెఱ్ఱివాగన్న అసలైన విప్లవంబు
మనిషితల గొట్టడముకాదు మనసుమార్చు
నమ్మమవధూతనిర్మలానందుబలుకు॥ 81

ఆ॥వె॥ చిన్న మొలకనాడు శీఘ్రంబువంగును
పెరిగి పెద్దదైన విరిగిపోవు
పద్ధతిగని పెంచు బాలబాలికలను
నిజమనె యవధూత నిర్మలుండు॥ 82

ఆ॥వె॥ నిండు సంపదైన వుండదు పనిజేయు
కష్ట బడ్డనాడు కలుగు ధనము
గుట్టలైనబోవు కూర్చుండి దినుచున్న
నిజమనె యవధూత నిర్మలుండు॥ 83

ఆ॥వె॥ గురువు తల్లిదండ్రి కులకాంతరోగులు
వృద్ధులు పసివారు పాలకులను
కోపపడిననాడు తాపంబె మిగులును
నిజమనె యవధూత నిర్మలుండు॥ 84

ఆ॥వె॥ మంచి చెలిమిమనను ముంచె చెల్మిగనుము
కష్ట సమయమందు కానకున్న
ఇట్టి మైత్రినీవు గుట్టుగ విడువుము
నిజమనె యవధూత నిర్మలుండు॥ 85

ఆ॥వె॥ మర్మ ధర్మములను। మందికి దెల్పక
జాగ్రత గలిగుండు। చనియెవరకు
నిప్పు మీద నివురు। గప్పినట్లుండురా
నిజమనె యవధూత। నిర్మలుండు॥ 91

ఆ॥వె॥ మదము యెక్కి గజము। మనజులాద్రొక్కిన
మాట బడునుసుమ్మ। మావివాడు
చెడ్డ శిష్యులున్న। చెడు పేరుగురునకు
నిజమనె యవధూత। నిర్మలుండు॥ 92

ఆ॥వె॥ నీచ సంఘమందు। నిల్వకునిల్చిన
అణిగి తప్పకొనుము। అన్ననీవు
వంగె తుంగకొనలు। భంగంబునొందునా?
నిజమనె యవధూత। నిర్మలుండు॥ 93

ఆ॥వె॥ ధనము వున్ననాడు। తప్పవు బంధముల్
కరవు కాలమందు। కానకున్న
వాన కురిసి [illegible]। మానినభంగిరా
జల్లు
నిజమనె యవధూత। నిర్మలుండు॥ 94

ఆ॥వె॥ ముందె కోపమున్న। తొందరమనిషికి
కొండె ముల్ దెలుపగ। కొంపగూలు
పుండు మీదమిరము। పోసినట్లుండును
నిజమనె యవధూత। నిర్మలుండు॥ 95

ఆ॥వె॥ నింద జేయువాడు। నిందించుచునెయుండు
నీతి యెరుగువాడు। నీతి నెరుగు
హంస కొంగభంగి। అంతరంగముల్ వేరు
నిజమనె యవధూత। నిర్మలుండు॥ 96

ఆ॥వె॥ జార గుణమువాడు। జగములో జనులను
జారుల నియుమదిన। దలచుచుండు
కంటి నిండపసుపు। కామెర్ల రోగికి
నిజమనె యవధూత। నిర్మలుండు॥ 97

ఆ॥వె॥ అన్న చెల్లినడువ। అన్యాయమనుజులు
రంకు మొగడుయనుచు। రభసజేస్తే
దృష్టి యెటులవుంటె। సృష్టిఅటులవుండు
నిజమనె యవధూత। నిర్మలుండు॥ 98

ఆ॥వె॥ ఎరుగకుండ చెలిమి। యెన్నడుజేయకు
చెలిమి చెడ్డదైన। చెడుపుగలుగ
మంచి బుద్ధికూడ। చెంచలం బౌనయ్య
నిజమనె యవధూత। నిర్మలుండు॥ 99

ఆ॥వె॥ మతము కులముభాష। మత్తులో బడవేయు
స్వార్థపరులయాట। సాగునపుడు
తుదకు జాతియంత। తుదముట్టు తథ్యంబు
నిజమనె యవధూత। నర్మలుండు॥ 100

తే॥ గీ॥ స్వార్థపరులు స్వతంత్రమున్। వ్యర్థపరచ
కుక్కజింపిన విస్తారై। జిక్కు తుదకు
మేలుకొనుమన్న యిపుడైన। మేలుకొనుము
నమ్ము మవధూతనిర్మలా।నందుబలుకు 101

ఆ॥ వె॥ భూతలంబుపై ప్రభుత్వాల్ నాయకులను
రాజ్య చట్టములను। మార్చుకొన్న
మార్పురాదు జనులు। మారనంత వరకు
నిజమనె యవధూత। నిర్మలుండు॥ 102

ఆ॥ వె॥ ప్రజలె లంచమ్మునిని। వారె లంచముబెట్టి
బూజుయని ప్రభుత్వ।ములను దిట్టు
ఆ ప్రభుత్వ మెవరు। ఆలోచించు కొనరు
నిజమనె యవధూత। నిర్మలుండు॥ 103

ఆ॥ వె॥ లంచ గొండితనము। లావుగా మైపోవ
మనిషిని మనిషిదిన। మరిగిపోవ
కత్తి యుగమువచ్చు। కాదన రెవ్వరు
నిజమనె యవధూత। నిర్మలుండు॥ 104

ఆ॥ వె॥ తనవుకు పనిలేక। మనసుకు పనిలేక
పిచ్చి యిచ్చలెన్నొ। వచ్చుచుండు
రెండిటికి పనిగలి।గుండక యీ పోరు
నిజమనె యవధూత। నిర్మలుండు॥ 105

ఆ వె॥ మొదటినుంచిగొప్ప। పుణ్యాత్ముల్ మేధావుల్
ప్రగతి కొరకుచాల। పాటుపడిరి
వారి ఋణముబోదు। పాదముల్ గడిగిన
నిజమనె యవధూత। నిర్మలుండు॥ 106

తే॥గీ॥ ప్రాణముల్ వురికంభము। పాలుజేయ
శాంతి సమరాన స్వతంత్ర। కాంతివెలిగె
కాంతిదూరమౌచుయశాంతి। గ్రమ్ముచుండె
నమ్ముమవధూతనిర్మలా।సందుబలుకు 107

ఆ॥వె॥ నాల్గుసాధనములు। నయముతోజూడక
రంగుబట్టలిచ్చు। దొంగలున్న
రాజకీయమౌను। బూజుసన్యాసంబు
నిజమనె యవధూత। నిర్మలుండు॥ 108

ఆ॥వె॥ రాజరికముబోయె। రాజ్యాలుబోయెను
ఇంటి కొకడుదేలె। ఇపుడు రాజు
ఆయుధము, ధన, బల।మానాద్యుయీనాడు
నిజమనె యవధూత। నిర్మలుండు॥ 109

ఆ॥వె॥ లేడు లేడు యనుచు। వాడువున్నడనుచు
లేడు వుండెమాయ। లేకిమాట
వాన్ని వాడు దెలియ। వాదనలుండునా।
నిజమనె యవధూత। నిర్మలుండు॥ 110

ఆ॥వె॥ చేసిపోయెవారు। చేసి వెడలినారు
యేమి జేసిరనుచు। యెగ్గుబలుక
అపటివారి పాట్లు। యిపుడు వీరికియేల
నిజమనె యవధూత। నిర్మలుండు॥ 111

ఆ॥వె॥ అన్ని మతముల కన్నను। సున్నమతము
గొప్ప దనులేదయేదైన। జెప్పు నాన్న
అన్నికలబోసివొకమతం। మిన్నయనుము
నిజమనె యవధూత। నిర్మలుండు॥ 112

ఆ॥వె॥ జెండలెన్నొ బుట్టె। మొండి మాటలునేర్చి
ఇంక బుట్టుచుండె। సంకనాక
పుట్టెకొక్క గుణము। పుట్టిందియైపోవ
నిజమనె యవధూత। నిర్మలుండు॥ 113

ఆ॥వె॥ వాడిమతము గొప్ప। వీడిమతము గొప్ప
మనసు శుభ్రపరచు। మతము యేది?
డబ్బు దాసు మతము। గొప్పాయెచెడిపోవ
నిజమనె యవధూత। నిర్మలుండు॥ 114

ఆ॥వె॥ మొట్ట మొదటపైస। బుట్టించి మనుజుడు
పట్టు పురుగుభంగి। కట్టుబడెను
నోటులేని మాట।లో టౌను జగములో
నిజమనె యవధూత, నిర్మలుండు॥ 115

సీ॥ ప॥ గంగాగౌడ్ పోశవ్వ। గర్భాన జనియించ
నారాయణ్ గౌడని। నామమిడిరి
ఆచార్య దేవుండు। అవధూత నిర్మలా
నంద స్వామియనుచు। నామమిడెను
మట్టి మాణిక్యం శ్రీ।మతి శకుంతల పుత్రి
భాగ్యముయను నామె। భార్య యాయె
సత్ప్రవర్తనచే జ।గత్పరం జ్యోతిగా
పిల్పించుకొనుచుండె। ప్రేమతోడ॥

తె॥ గీ॥ మాది నిజాంబాద్ మండల। మందునున్న
ముధకుపల్లి గ్రామంబులో।మునులుఋషులు
భక్తులు యతులు యోగ వి।రక్తి పరులు
నమ్ముమవధూతనిర్మలా।నందుబలుకు॥ 116

సోஉహం